# కష్టకమల

రాయప్రోలు
సుబ్బారావు

▲



నవ్య సాహిత్య పరిషత్తు –
▲ గుంటూరు ▲

# ప్రస్తావన

ఇది శ్రవణపాత మయిన ఒక యుదంతము. కథాభాగములు చక్కగా అన్వయ మగుటకు రెండుమాటలు.

పూర్ణ సకలసత్త్వ గుణపరిపూర్ణ. ఆమె అనపత్య. ఇతరుల బిడ్డలను కన్నులతో పెంచుకొనుచు తనకడుపుకొఱత దీర్చుకొనుచుండెను. కుమారుడు పొరుగింటి బాలుడు. కమలయును ఇరుగువారి బాలిక. కుమారుడు ఆమెకు బిడ్డవరుస. కమలకు పూర్ణ మేనత్త. పూర్ణపుట్టింటివారి గృహమును, కమలాంబ ఇల్లును దగ్గర దగ్గరగా నున్నవి. 'అక్కయ్య వచ్చె'నని కేకలు పెట్టిన ఆడుబిడ్డ పూర్ణచెల్లెలు. కమల ఒక కృతి రచించుచున్న దనియు, జ్ఞాపక మున్న పద్యములను కుమారుడు తన శేఖయందు ఉద్ధరించె ననియు, ఆ కృతికి 'శాంతి' గా తనపద్యమును లగింప నాసించె ననియు ప్రకరణమునందు ఆకాంక్షింపవలెను. వీరి యాటపాటల సావాసము నానాట పెనచుకొనెను. ఈ తీగెలజంటకు పూర్ణ చల్లని పాదయ్యెను. కుమారుడు చదువుకోసము నగరమున కేగెను. కమల పుట్టింటనే నిలిచియుండెను. వీ రిరువురకును కాగల 'పెండ్లిమాట' ఎవరును తడవియుండ లేదు. ప్రవాసకాలమందు కుమారుని ఊహలు మాఱెను; స్నేహభావము కామకాంక్షగా బరిణమించెను. కమల మనోవనము ఇంకను పూతకు రాని పసిమొక్కల మడిగానే ఉండెను. కుమారుని యుత్తరము కమలకు తలపని తలంపు. పరస్పర గ్రహణ దశకు రాని రసభావములు సంకులము లగుచున్నవి; కాని స్థాయి సుఖము నందుచున్నట్లు లేదు. ప్రకృతికూడ ఈ వికారమును చక్కపెట్టుటకన్న సమాప్తము చేయుటకే తోడగుచున్నట్లు తోచుచున్నది. ఈ భావవిన్యాసమందలి కష్టరేఖయే ఈ కృతికి బీజము.

# కష్టకమల

పిడికిట నొదిగెడు నడుమును
సడలని యొడ్డాణమును పసపు కంఠమునం
దిడికొని, వాలెడు కుచ్చెల
లడుగులపై తెరలి త్రొక్కులాడుచు నుండన్ ,

ఒక శుక్రవారమున, గ
న్యక యొర్తుక యింటివెనుక నవకమ్ముల తో
టకు జేరవచ్చె కౌతుక
చకితం బగు మనసుతోడ, సంభ్రమగతియై.

మాపుల నీరు గట్టకయ మానిన చెట్లకు శిష్యు డొక్కరుం
డోపికతోడ దీర్ఘికల నూఱుజలంబులు పోయుచుండె, నా
దాపలి మల్లెపందిలి కతంబున నొండొరు జూడరైరి వా;
రాపె సమీపమందు పురు గైనను లే దదియేమి చోద్యమో!

పెండ్లియా డైన యా పదియేండ్లపడుచు
అవయవ వికాస శోభల నంతకంటె
కొంచె మెదిగిన యట్లు కాన్పించు నవుర !
యీడు రాని బిడ్డల యంద మెంత వింత !

# క ష్ట క మ ల

చెవులకమ్మలు పెట్టని చెలువు కొంత,
ముక్కుపుడకలు తీసిన బోసి కొంత,
చిన్నబోయిన యా కన్నె వన్నెకొంత,
జాఱుముడితోడ వింత సింగార మొలికె.

ప్రియ మనికొని, యా సుకుమా
రి యుల్లిపొరవంటి యుత్తరీయపుపయటఁ
నయముగ పొదివిన లేఖను
కయికొని, విప్పం దొడంగె కడల నరయుచుఁ.

కడిగిన కాటుక రేకల
యొదుపులతో చూపు మెఱుగు లొలికించుచు నా
పడుచుం జిన్నది కళవళ
పడు నెడ నెడ లేఖ విప్పి పరవశమతియై.

విప్పి దడబడుకరముల, విప్పి రెప్ప
లల్ల వాలిచి యరయు, బిట్టదరి నట్లు
కన్ను లెత్తి దిక్కులు సూచు, గడియకొక య
వస్థగా బిక్కవోయి యా బాల యపుడు.

## కష్ట కమల

పలుచని యాఁపె చెక్కుల లవంగపుమొగ్గలు వోలె చెమ్మటల్
మొలిచె, కనుంబొమ ల్విరిగిపోయి యొకానొకవింతభావ ని
ర్ధళనము బట్టియిచ్చెను, కరంబుల రేఖయు జాఱి జాఱి ముం
గల బడె మూఁడుమార్లకట! కన్నియచిన్నెలు చెప్పలే మికన్.

కడలు తిలకించు, ముడిచిన కమ్మ మఱల
విప్పు నుంకించు తడియైన వ్రేళ్ల నల్ల
పయ్యెద చెఱంగుతో నొత్తు బాల యపుడు;
భ్రాంతి నేమియు దోఁచక ; యింతలోన -

అమ్మాయీ! యను పిలు పొక
డమ్మగుదకు జెవులబడియె, నంతట నాందో
ళమ్మున నటు నిటు గను; చీ
కమ్మను నే నెందు దాచగల నని భీతిన్ -

సుంత యోజించి, యొకమల్లెచెంత దాని
నిసుకలో మాటి గుర్తుగా నిడుము ననుచు
త్రుంచబోయి పూవుల రెమ్మ త్రుంచ లేక
వంచి యొక చిహ్న మచట నేర్పఱచికొనుచు;

## క ష్ట క మ ల

అలలకోనేట నరుగు రాయంచ లీల
ఆ మృదూద్యానమున మందయాన యగుచు
బోయె నాకన్నె, చేదుడు నూయి పొంత
పచ్చి పసపు నూఱెడి తల్లిపజ్జ కంత.

జాము ప్రొద్దెక్కె, నింకను జాగుచేసె
దేటికే? కన్నతల్లి! ని న్నెవరు పిలిచి
రింతలోన ? తలంటెద నింట నున్న
మంచి నూనెను పాత్రలో వంచి తెమ్ము.

అని పలుకు తల్లిమాటల నాలకించి
బెదరుచూపుల నిలుకడల్ కుదురుపఱచి
నూనె గొనివచ్చె నాకన్య, తోన వారు
తీవ బచ్చలి యల్లు పందిలికి జనిరి.

అచటి కందిచాపుల బిడ్డలట్లు పెంప
బెరిగి కొమ్మలు సాగి పుష్పించి నట్టి
చంద్రకాంతపు మొక్కల చాళ్ళు గలవు:
అట్టి శోభ లేదు మఱెందు చుట్టుపట్ల.

అది యొక చిన్న పల్లె, మన మచ్చట జూచిన కన్నె యొక్క ప్రా
జదువులవారిబిడ్డ; కుడిచాయన తాళదళీ కుటీరముల్
కదియక దూర దూరములుగా గల, వందుల నెల్ల నందమై
పొదలుచు నుండు నాముగుదపుట్టినయిల్లును తూరుపుంగడ౯.

ఆ గృహలక్ష్మి పైట కరకంచు చెఱంగున నింపు నింపు లే
దీగెలపూల పోకడల తిన్ననయై కదళీవనంబు, లీ
లాగతి సాగు కంతతరళం బగు ముత్తెపుదండ నాగ నం
దేగెడు నొక్క క్రొంబొడుపు లేఱును పచ్చనిగట్ల రాయుచు౯.

నిగనిగ లెగయు కన్నెచిగుళ్ల గుత్తుల
నీడ లారెడు చిన్ని నిమ్మచెట్లు,
పురి విచ్చినట్లు చిమ్ముల కొమ్మపందిళ్ల
సాచు కుమార రసాలతరులు,
చువ్వల శ్లైదిగి మంజుల గుచ్ఛముల వ్రేలు
మొలక ప్రాయపు మంచి పోకచాళ్లు,
కడలెల్ల వాసనల్ సుడిగొట్ట విదిలెడి
పూగొమ్మ లూగు పున్నాగమొక్క,

లందు నందును బెరిగి, యా యందమైన
బ్రాహ్మణుల యింటితోటకు వన్నె బెట్టు,
వెదురులును గున్నగోరంట పొదలు బలిసి
చోటు నలవి గాని కంచెగా బెరసియుండ.

పోకలను గాగిలించు తాంబూలలతలు,
పందిరుల నెక్కు లే ద్రాక్ష వల్లికలును,
పచ్చ చేమంతి మడులును, బంతిపూల
కుదురులును గొన్ని కలువ కన్నదరజేయ.

మవ్వ మలపోని మధ్యాహ్న మల్లికలును,
నవక మొలయు కాశీరత్న లవలికలును,
తులసితోటకు నావల నిలిపినట్టి
యలవలకు నల్లియుండె నాయనటితోట.

దక్షిణపు దిక్కునందున దట్టమైన
త్రాటియాకులు గట్టిన దడులు గలవు;
ఆవ లీవల వార లన్యోన్య మరయ
వెరవు గల దా సమీపాన దిరుగునపుడు.

కెలకులందు ననాసమొక్కలు పెరుంగ
రాలు నిసుకల టెంకాయ పాలవంటి
నీళ్ళెగయునట్టి దొరువు సన్నిధికి బోవు
దొడ్డిగుమ్మంబునుండి యాత్రోవ బట్టి-

పదముల నందియ ల్మోరయ పాయలు పాయలు పోవుపెన్నెరుల్
వదనము నడ్డగింప కమలా! కమలా! యను చొక్కుయాడుచి
న్నది యపుడందు వచ్చి కెలనన్ గలయన్ దిలకించె గాని; యా
ముదితకు గానరాదు మనముద్దులకన్నియ లోని కేగుటన్.

అటునిటుజూచి చూచి, కమలా!కమలా! యని పిల్చిపిల్చి యె
చ్చట నెవరున్ గనంబడమి చాన గిరుక్కున మళ్లి యేగ, వా
కిట నెదురైన శిష్యు దిలకింపకయే, తన కేలుదోయితో
కుటిలశిరోజపాళి సిగకున్ మెలయించుచు నల్ల నల్లనన్.

మాధవుడింట బుట్టిన కుమారుడువోలె మెలంగుచుంటచే
సోదరి యట్టు లా కమలయున్ మెలగున్ జిరకాల మిట్టులే
భేదము లేక యుండ నడిపెన్ విధి వారలమైత్రి బూర్వపు
ణ్యోదయముల్ సుమీ! ప్రణయయోగ్యములా ననిమిత్త
బంధముల్.

## క ష్ట క మ ల

తలలోని నాల్కవలె నిం
తల యంతల వారి కెల్ల తమవాడై శి
ష్యులలోన మాధవుడు చను
వుల కలవడె; వయసు పూచి పొంపిరివోవఁ.

కమలను పిలువ బంచిన కన్నతండ్రి
యానతి గృహాంతరంబున కరుగు నతడు
మధ్య చావడిలో నొక మందసంబు
దరి గదలుచున్న ధవళపత్రమును జూచి-

దరియగా బోయి, యందు ముత్యాలు మూట
గట్టినట్టుల మోహనాక్షరము లుండ
వంగి చేసేత బట్టి, తరంగితాంత
రంగుడగుచు బంధుర భావరక్తి సాగసి-

"ప్రియములో అప్రియమ్ములో, భరించి భరింపగరాని పేమనో
నియమము" లంచు నెయ్యదియొ నెమ్మదిలో వచియించునంత, కం
దియ లొరయం గుమారిక విదీర్ణకలాప కచాళితోడ వ
చ్చి యొడిసిపట్టి లాగికొనె జేతుల జిక్కిన శ్వేతపత్రముఁ.

గురుకుమారి తీసికొనిన పత్రము మాధ
వుని నలంతివింత మునుగ జేయ
చిక్కవాఱి జాఱు చికుర జాలముతోడ
నున్న యామె చాయ నోర జూచి-

ఆ లీలావతి యాస్య మప్పుడొక తీరై కానుపింపన్, ప్రకం
పాలోలాలసు డయ్యె మాధవుడు, కన్యారత్నమున్ వానిక
ల్లోలం బింత యెఱింగి యిట్లనియె, వాలుంజూపు సారింపులన్
రాలం జిక్కదనాలనవ్వు సుకుమారం బైన వీణా శ్రుతిన్.

వాదులు పెంచుకొన్నయల భారవిపద్యము నన్వయించితో
యీ ! దశమీ ప్రభాతమున నే నొకదానిమయంటు తెచ్చి నీ
పాదులపొంత నాటితిని, పాపము శారద యిచ్చినట్టి యంచేది
యొ చెప్పబోయి భ్రమియించి మెడన్ తడవం గడంగుచున్,

'అయ్యొ' యొడ్డాణ మనుచు నాయబల యరిగె
జలము లొత్తిన పైటకొంగులు నడాడ,
శిష్యుడును వింత వింతలు చెనయ జెదరు
ఎడద నింకొక చోద్యంబు సుడియజేయ-

## క ష్ట క మ ల

చనియె నతడును వెనువెంట సంభ్రమమున
కన్నెయడుగుల సాగ సైన తెన్ను బట్టె;
ఇరువురును జేరబోయిరి యించుకంత
ముందు వెనుకగ బచ్చలి మూలపాదు.

తల్లి తీవియ కెడలి క్రిందకును జాఱె
యేకతమ నూగు నొక లవలకుమారి
యఱుత బడ్డ బంగరుత్రాళ్ళ యురివిధాన
మీఱు నొడ్డాణ మగపడె వారి కచట.

ఇటులా బాలలతామతల్లి మెడలో నేపారు చొడ్డాణ మ
చ్చట గాన్పించిన నా కుమారియు విలాసమ్మైన కెమ్మోవి చెం
గట వ్రేలూని యొకింత నిల్చి తుది నాగన్ లేనిరాగాన ము
చ్చట లూఱన్ స్పృశియించి కాంచె నొరు లెంచన్ లేనిచేతః
స్పృహన్.

ఏమియును బల్కకంత నాలేమ నగను
దీయగాబోయి కుతుకాన దీయలేక,
మాధవుని మోము గని బతిమాలుకొనియె
తెలియ వాక్కొకతఱి తీపు తెఱగు లిలను!

మొగలిపూవులలో దేనె మొలవబోదు,
కర్ణికారమునకు లేదు కమ్మదనము,
శశి నిశీథినీప్రియుడు, శోషణకరుండు
తరణి, యొక్కొక కళ కొక్క స్థాయి కలదు.

నీరదకుమారు లెడలరు నెత్తములను,
తిమిర దోషము గుహాల బంధింపబడెడు,
మధురఫలములు తినదు కుమార హరిణి,
మొగరుచిగురులు కోయిల యోగిరంబు.

ఏ మృదుముగ్ధభావ ముదయించెనో యా సుకుమారి డెందమం
దామెయి జెప్పలేము నయనాంచలముల్ చెమరింప జూచి యిం
కేమిటి కాలసించ నని యెంచుచు శిష్యుడు సొమ్ము దీసి క
న్యామణి చేతి కిచ్చె వినయమ్మును మాలిమియుం. బెనంగొనన్.

అపుడు కిలకిల లాడుచు నగ్రశాఖ
నుండి దొరగా పండిన పండు కొటికి,
మొలక కెంపులవంటి గింజలను రాల్చె
చిన్నిదానిమ్మచెట్టుపై చిలుక యొకటి.

అది గని వార లిర్వురును నా తరుమూలము డాయ నేగి; ర
య్యాదను నెఱింగి కెవ్వన నోయారపు కూజితము ల్వెలార్చ చా
గొదమశుకంబు వోయె నదిగో ! యని వ్రేలటు లెత్తి చూపుచుం
కదలక నిల్చియుండె, కడకన్నుల కందెషు దాక కన్నెయుఁ.

మాధవుడు పండు గోసెడు మనసుతోడ
వృక్ష మెక్క బోవుచు నుండె, నింతలోనె
తోటదడికి నవ్వలనుండి తొంగి చూచి
'అదిగొ కమల' యటం చొక యాడుబిడ్డ—

పొఱుగుగృహంబు నుత్తరపుమోసల నుండి యెలుంగు నెత్తి చే
జఱచుచు, రమ్ము రమ్మని వెసం బిలువంగ దొడంగె, నయ్యెడం
బరవశయై శుకంబు సను మార్గము జూచుచు నున్న కన్నెయుఁ
సరసపు కన్నులఁ బిలుపు చాయలకుఁ మఱలించి యింపుగఁ.

అక్కయ్యా వచ్చెనంచును
జక్కని చే యెత్తి పిలుచు సకియను గని తా
గ్రక్కున బరువెత్తెను చెలి;
యక్కున నొడ్డాణ మింపు లాడుచు నుండఁ.

ఇటు లామె వెడలిపోవఁ
ద్రుటితారుణ బీజ మయిన ముదురు ఫలంబుఁ
దటుకున గోసుక చనె నం
తట శిష్యుడు గురుకుటీరతలమును డాయఁ.

కమల యట్లు తాతగారి యింటికి బరు
వెత్తి పోయి మేనయత్త నరసె
గాని, మనసు చనవు గనమి నెప్పటి యట్టు
లామె దరియ బోక యవల నిలిచె.

పండువంటి కుంకుమబొట్టు నిండుకొనిన
వదనమున లేతనవ్వు దోపంగ నామె,
చేర రమ్మని దరికి దీసికొని కేల
బాలచెక్కిళ్లు దువ్వుచు తేల జూచి.

ఎంత యాలసించితే తలంటునకయి?
నాన్న యింటిలోన నున్నవాడె!
యనుచు నీళ్ళు గాఱు నాకన్నె దూముడి
విడిచి, పైట లాగి తుడువ దొడగె.

అపుడు కమలను బిలిచిన యనుగుజెలియ
వడివడిగ నేగుదెంచి యాబిడను జూచి
ఎక్కడికి బోయినావో? మీ యింటి కేగి
పిలిచి పిలిచి వచ్చితి నమ్మ! యెలుగు రాయ.

మేము గోరంట తోటలో మెలగుచుందు,
మీవు వచ్చిన ర మ్మని యింపు లొలుక
బలికి, తనకయి వాకిట నిలచి యున్న
యీడు కన్యలతో జోడు గూడి పోయె.

చెలియ పలుకుల కేమియుఁ జెప్పలేదు,
మేనయత్తను మొగ మెత్తి కానలేదు,
ఒకపెడకు మోము త్రిప్పి, వాలికలు చిలుకు
కళుకు కడకన్నులను వాల్చి కన్నె నిలిచె.

పొత్తు కుదురని భావముల్ క్రొత్త క్రొత్త
మనసు రాపిళ్ళ కెడ మీయ, వెనుక లేని
యొక యపూర్వ శోభన రీతి నున్న కమల
చుబుకమును బట్టికొని, నను జూడు మనుచు.

ఆయమ బాలికా వదనమందున చూపులు నిల్పి దృష్టిదో
షాయిత బుద్ధిమై మెటికె లల్లన దీర్చుచు, గ్రిందిపెప్పలన్
బోయు నలంతిచెమ్మటలు వోదుడిచెన్, చెలి జాఱుపెన్నెరుల్
పాయక కాలసర్పము నెపాన నిజాంసములన్ బెనంగొనన్.

కమల మొగమ్మునందు కసికాటులు వడ్డ మనోవిభావముల్
విమలముగా గనంబడె, నవీనభరాలస మైన చూపులన్
బొమల యొయారముల్ ప్రణయపుం దొలిచిక్కుల నల్ల వెట్టె, చి
హ్నములకు చిహ్న మై చెలువ యందమె చెప్పక చెప్పె
నంతయున్.

ప్రాణముకంటె నెక్కు డనురాగముతో దిలకించి పెంచు వి
న్నాణపు మోహపుత్త్రికతనన్ చెలికిం గడుగూర్చు పూర్ణ యొ
డ్డాణపు జిన్నదాని వికటం బగు తీరు నెఱింగి, కుంతల
శ్రేణి తెమల్చు చెద్దియొ వచింపగ బోవుచు నుండె నయ్యెడన్.

కమలా! యంచును గేక వేయు జననీకంఠస్వరం బాలకిం
చి మొగం బోరగ జేసి చూచె జెలి యా సీమంతినిన్ చద్దియ
న్నమువే ళైన నెఱుంగ వైతివిక దే నా తల్లి ఘా మ్మంచు నా
యమయుం బంపె గుమారితీరులకు డోలాందోళయై పిమ్మటన్.

కొడుకు ప్రవాసి యై చదువుకోసము పోయెను, మున్ను నెన్నడు
న్విడిచి యెఱుంగ రీ యనుగుబిడ్డ లొక ళ్లొకరిఁ, కుమారు డీ
బిడకు లిఖించు నుత్తరపు వృత్తము లైన నెఱుంగ రావు, నా
మెడకు దవిల్చినారు బలిమిఁ దలిదండ్రులు వీరి బంధముఁ.

చిలుకయు గోరువంక బలె జిన్నతనంబుననుండి యాటపా
టల నొక రై మెలంగిరి, విడంబడి పోవుచు నీదుభార మీ
చెలి యని యొప్పగించి విడిచెఁ సుతు డక్కట! దైవసూత్రముల్
తెలియవు, పెద్దవా రనుమతించుట మంగళ మంచు దోచెడిన్.

ఇన్నిదినాల నుండి చలియింపని యోజననా ప్తమైత్రి నీ
చిన్నది చిన్నవాడును విచిత్రపుటైక్యము, బెంచికొన్నవా
రెన్న బరస్పరంబు గ్రహియించిన యట్టుల గోచరింప దీ
కన్నియ కా కుమారునకు గాగల కార్యము లెవ్వియో, యికన్!

అను చేమో తలపోతల
మునుగుచు నా సాధ్వి కలత బోవుచు నుండన్;
చనె నా బ్రాహ్మణ వాటిక
ననుదిన గృహదేవతార్చ నాతిథ్యంబుల్.

కడ వెత్త బ్రొద్దు గానం
బడని దినా లోదవనున్న బహుళాశ్వయుజం
బెడలిన శారద యగుటను;
కడల బ్రదోషంబు లలమె గడువేగముగన్.

వయసున బిన్న యయ్యు, గుణవత్కులపుణ్యవతీవిభూషణం
బయి చెలువారు పూర్ణమయు, నా దివసంబున నింట భోజనా
లయిన యనంతరంబు పరమాదరు లౌ కమలాకుమారికా
ప్రియజనులన్ గనుంగొనగ వేగమె యేగెను వారియింటికిన్.

అచట నొకకొంతవఱకు నన్యోన్యకుశల
భాషణంబులు జరిగిన పయిన యామె
చేత పుస్తకమును పూని చెంత నున్న
కన్నియను జూచి నవ్వి దగ్గఱకు బిలిచి.

తాను గూర్చున్న ఖర్జూరదళ సుఖాస
నమున కూర్చుండ బెట్టికొంచు ముద మొలయ,
చక్కనివి పదిపద్యాలు చదువు మనియె;
కమల యంత కోకిలవంటి కంఠ మెత్తి.

## అ జ వి లా ప ము

బాష్పపరిపీడ నెలుఁగు రాల్పడగ నవిసి
యజుడు విలపించె సహజధైర్యమును బాసి,
తప్త మయిన లోహమును మార్దవము నందు :
క్షితి శరీరధారుల నింక జెప్పనేల!

పూలదండ దేహముమీద వ్రాలి యట్టె
ప్రాణములు దీయజాలిన దక్క— ఉకట!
తెగి వధింప దలంచిన జగతియందు
వనజగర్భున కేది సాధనము కాదు?

అకట! మృదువస్తువును తెగటార్ప యముడు
మృదు వయిన సాధనంబునే వెదక బోలు;
కలదు పూర్వనిదర్శన మిలను నలిని
చెడి కృశించుట హిమకణ సేచనమున.

చంపగలదేని యీ పుష్పసరము సకియ,
నెద ధరించిన నన్ వధియింప దేల?
విషమె యమృతం బగును నొకవేళ, నమృత
మే విష మగు మఱొకవేళ నీశ్వరేచ్ఛ!

నా మహాభాగ్య విలయంబునకు విరించి
వెదకి యీ మాయపిడుగు గల్పింప నోపు!
లేకయున్న కొమ్మలపైన ప్రాకు లతను
త్రుంచి మూలవృక్షము బడద్రోయ దెట్లు?

అనుచు మంజుల మంజుల మయిన కంఠ
మంత కంతకు భరమున నణగిపోవ,
అతి కరుణ మైన యజ విలాపాశ్రుగీతి
జదివె గన్నియ ప్రణయ విషాదరుతుల.

హృదయపదమ్ము వెన్న నొనరించి ద్రవింపగ జేయు నామె గ
ద్గదరుతి యార్ద్ర ఖేద నిశితం బగు శోషణ భావ మీనగా;
చదివినయంత సేపును విషాదముతోడుత గంటినీళ్లు ప
య్యెదకొన నద్దుకొంచు వినియెన్ నయనమ్ములు వాల్చి
పూర్ణయున్.

పండితబాల యా కమల భావము విస్ఫుటమా విధాన బూ
దండలు వోలె గూర్చిన సుతారపు పద్యములన్ బఠింప; రే
యెండ యలంతికోత లలయింపులు గాంచెడుచంద్ర కాంతపున్
ఖండము లట్టు లయ్యె ననుకంపమెయిన్ వినువారి చిత్తముల్

## కష్ట కమల

కమల చదివెడు నజవిలాపము ముగించు
వఱకు దాళంగలే రైరి వరుస దీర్చి
చుట్టుప్రక్కల నచట గూర్చున్నవార;
లప్పుడు వసంతశాస్త్రి యా శాంత మరసి;

కన్నతల్లీ! ప్రదోష మాసన్న మయ్యె,
పఠనయోగ్యము గా దింక స్వస్తి చెప్పు
మనుచు బలికి, శిష్యులతోడ నాలయంబు
నిర్గమించె సాంధ్యార్చనానియతి నంత.

కమలకడకంటి రేకలు కంది నట్టి
యామెమనసు వెలార్చు టాస్యమున నెఱిగి,
పిన్నతీవచెల్లెండ్ల జూపింతు గాక
ర మ్మనుచు బిలిచికొని పూర్ణమయు నేగె.

కమలయు పూర్ణయుౕ వరుసగా నొకకొంత చరించి రా ప్రదో
షమున ననంటితోట, సరసం బగు చిత్తములేమి నందచం
దములకు పేరుపిల్పులకు దావల మైన లతా కుమార బృం
దములను జూపదయ్యె గలతల్ కబళింప వసంతుపుత్రి యుౕ.

కన్నియమోమునన్ కటువుగా నుదయించెడు చిన్నె లెల్ల ము
న్నెన్నడు జూచియుండమి కోకింత దలంకుచు, నా కుమారి లో
నున్న రహస్యభావ మరయుం దలపూని వచించె నిట్టు లా
సన్నుతి పూర్ణ పూర్ణ కడు సన్ననియెల్గున భిన్నచిత్తయై.

మొగ మిటు చిన్నబుచ్చికొని మూసినముచ్చటతోడ నేటికే
పొగిలెదు చిన్నదాన! యెడముల్ విధియించిన పుత్త్రుచెయ్వులన్
దెగియెడు నామనంబు గడ తేఱగ నీయవు క్రొత్తక్రొత్తలై
యగపడు నీవికారములు నక్కట! యుమ్మలికంబె తార్చుచున్.

కొడుకుల గూతులన్ గనుటకున్ పువుపూజలు సేయనైతి, నే
ర్పడియెడు దుర్గతుల్ గడువరా దని కానగరాని వేదనన్
సుడివడి స్రుక్కు పాడుమనసున్ బిగబట్టితి నించు కంత, నా
కడుపుకొఱంత దీర్చుకొనగా మిము జూపె నటంచు బాలరో!

పుట్టితిరి కన్నతల్లుల పుణ్యలతిక
లోలి గాచిన ముక్తాఫలా లనంగ,
కట్టితిరి నాదుమనసు గాంక్షాకలాప
పాశముల ముద్దుముచ్చటల్ వలవ జూపి.

## కష్ట కమల

పెంచిన యట్టిమోహము తపింపగ జేయగ నింతచేటు బా
ధించెద గాక నిన్ను గలదే ! గతి యొందును దత్తకాంక్షకున్
వంచన జేసినట్టి భగవంతుని వ్రాతకు సోలి యేమి కా
వించిననేని శాంతి కనిపించదుపో ! కమలా ! యెడందకున్.

చదువుల సరస్వతివి నీవు, శారదా వి
కాస వర్చస్వి యాతడు, కనుల చంద
మామ లై మాపరాని చుమ్మలకు నేల
పాలు జేసితి రీ మందభాగ్యురాలి !

దూరభూముల నున్న ముద్దులకుమారు
జూడజాలని కొఱత నిక జూచి తీర్పు
కొనగ వచ్చితి నమ్మ యో కనకగాత్రి !
ఏల మన సిచ్చి మాటాడజాల వీవు.

కళకళలాడు నీ నగుమొగం బాకతీ రయి తోచు, నందముల్
నలగని యిన్నినాళ్ల కమలం బిది కాదు గదమ్మ తల్లి ! యా
కులపడి యేల దాచె దిదిగో, మిము ప్రాణముబోలె జూచుకొం
చలరు త్వదేకవత్సల, భయంపడ నేటికొ నాకు జెప్పగన్.

అని దత్తప్రేమామృత
యును, కోమలపుష్ప హృదయయును, నగు నా పా
వనచరిత పలుకు పలుకులు
వినుచుండె గుమారి భయము వినయము దోపన్.

తేటలు తగ్గి నిగ్గువెలితిఁ దొలకాడెడు బాలమోమునఁ
బాటిలె జంకు లప్పు డవి పాయగ నక్కున జేర్చె బూర్ణ, యా
రాటము లెంతయెంత మధురంబులొ యిర్వుర నిండుకన్నులన్
కాటుకముత్యముల్ గురిసె గండతలంబుల జాఱ లేర్పడఁ.

పరమపావనియును, ననపత్య యైన
బ్రాహ్మణీమణి యోర్తు, పావనకులీన
వికచగుణపూత యైన కన్యక యొకర్తు,
నిలిచియుండి రా కదళీవనీతలాన.

ఆ యమ్మయు నా కన్నెయు
నాయెడ నొక్కింత యుండి రాందోళితలై
యా యోషామణి మోమున
కై యోరగ శిరసు నెత్తి కమలాంబ తుదిఁ.

## క ష్ట క మ ల

నల్లని సోగగన్నుల కొనల్ ప్రియబాంధవిమీద వ్రాల నా
పల్లవపాణి హస్తముల వాడిన తామరతూడువోలె శో
షిల్లి పడెన్ గుమారి, యొకచెంపకు ముద్దుమొగంబు వ్రేలగా
తెల్లని లేతచెక్కిళులు తేటలు వో జెమరించుచుండగన్.

అట్లు సొమ్మసిలిన యనుగు గన్నియమీద
సుప్రసన్నుడై విశుద్ధపవను
డల్లనల్ల నొదిగి చల్లగా విసరి వే
సటల సడల నడచె సందె లలమ.

వెన్నెలల స్వస్థపడు కల్వపిల్లపగిది
గీతి వడదేఱు పాప రా కూతుభాతి,
స్వాతి వాకట్లు విడు శుక్తి బాలలీల,
గాలిచే శోషబాసె నా కన్నె యపుడు.

పలువరుస మల్లెమొగ్గలు బయలుపడగ
పండుటధరంబు కదలించి పలుకబోయి
అనుగు మేనత్త కవుగిలి నల్లన విడి
పించుకొనుచు పూవులరెమ్మ పంచ కరిగె.

బాల యచ్చటి యిసుక నావలకు నెట్టి
యుదయమున దాచిపెట్టిన యుత్తరమును
తీసికొని వచ్చె, వింతయొద్దికల బెరయు
మనసుతో పూర్ణ యది యెల్ల గనుచునుండె.

తెచ్చిన యుత్తరంబు విడదీయుచు మవ్వపునవ్వు చెక్కులం
దచ్చువడంగ, విస్మయము నందెడి డెందముతోడ పూర్ణ మో
మచ్చుగ జూచె బాలిక యొయారపుసిగ్గులచిత్తవృత్తు లం
దిచ్చెడు నేత్రముల్ మఱల నించుక వెన్కకు లాగుచుండగన్

ఆ దయామధురాత్మతో ననియె నిట్లు
అత్తరో! యనిమిత్తపు వ్యథల కేను
పాలయితి నేడు, మిమ్మును పాలుచేసి
నాను క్షమియింపు మెంత విహీనమతినో!

చినుకులకు వేచు చాతక శ్రీకుమారి
మెఱయు మెఱుపుల తెఱగు లే మెఱుగ గలదు?
వానకారును మరిగిన వనమయూరి
కార్తికజ్యోత్స్నలకు నెట్లు కాంక్ష సేయు?

# క ష్ట క మ ల

పూలు గోయ బోయిన ఋషి బాలకుండు
మంచి రతనాలసరులు పంపించు ననుచు
నెదురు సూచెడు ముగ్ధ యూహింపగలదె ?
నైజబంధము లట్టె మానసము విడునె ?

అత్తా ! మీ సుకుమారు డంపిన రహస్యమ్మైన యీలేఖ నా
చిత్తం బాకులపెట్టి పెక్కువగలన్ జెండాడె, క్రొంగ్రొత్తలై
పొత్తుల్ వోవని భిన్నభావములు తెంపుల్ వెట్టి కోడాడ నా
వృత్తం బిట్టుల వింతవంత వెతలన్ బింబించె జేతో గతిన్.

వినిపించెద వినుమని తన
మనసున నుత్కంఠ వెలికి మసలగ నీ, కా
కనకాంగి చదివె నీ గతి
ననుగుసఖుని లేఖ తరువు లాయమ వినగన్.

## ప్రణయ లేఖ

విడువక రేల్బవల్ ముసురు వెట్టెడు కట్టిడి బాష్పధారలం
దడిసినపాన్పుపై బడి, వితాకున లేచి, గవాక్షమందు మో
మిడికొని, ప్రాలు నాశలపయిన్ నయనమ్ములు పెట్టి వీడు పూ
దోడిమల బాంధవం బరయు తొయ్యలి యెవ్వతొ ధన్య
యయ్యెడిన్.

ధవళచంద్రికల్ శుభ్రవస్త్రములు గాగ
నిర్మల నభంబు విప్పు పెన్నెరులు గాగ
గతరజో మలినంబులై కడలు, కమల!
దర్శనార్హాము లయ్యె స్నాతకల యట్లు.

సంజ గైసేసికొనిన పూసరమునందు
దళము లెడరాల నిలుచు వృంతములదండ
కన్నె కంఠము విడలేదు; కాలనియతి
విడిచియును తన సగము లయ్యెడనె యుంచి.

లేదమలపాకు బాత్ర బాలిక రచింప
నాకు నాకున మొలుచు ముత్యాల నొకడు
నింపుచున్నాడు దాని, గన్నియరో! త్రాగు
దురో! తుది నొలుక బోసికొందురో వనాన!

## క ష్ట క మ ల

వలుద జడపాయల ముసుంగువడిన పువ్వు
పగిది, పలుకని కోకిలబాల భాతి,
భావ మీయని మెలగువ్వపడతి నేమి
సేయగలవాడొ? యాబిడ చెలిమికాదు!

ఆ పుత్తలకుగాని, తియ్యని యభిమతములు
పొదలలో పూచి జీర్ణించు పూలు సుమ్మ,
గరళ మపరంజి గిన్నెలో తెఱచియుంచి
యెట్టు లనపాయ మనుచు నూహింత్రొ! చెలియ!

ప్రియముతో బెంచికొన్న తీవియలు కొన్ని
విషలత లటంచు దోచినఁ బెఱికివైతొ ?
పూలు పూయవొ ? పరిమళంబులను విడవొ?
చూడ సుందరములు కావొ? సొగసులాడి !

వలపులు పొంగగా పొడుపు వాకలలోని జలంబు పోసి, మి
త్రులగతి బెంచికొన్న చిగురుం బువుగొమ్మల నెల్ల డాసి యో
చెలువల చందమామరొ! వచింపుము నా ప్రణయంపు టొప్పగిం
తలను ప్రవాసవాసములు దారుణదైవికపాత్రము ల్గదా !

నీవు మొదలిడినట్టి వన్నియల కృతిని
క్రింది పద్యాల నుపసంహరింపు మబల !
ఉదయ మెంత మోహానమ్మైన, వదలదా
దోషకబళన మవసాన శ్శేషదశను.

## కృ తి

మృదుమృణాల డోలిక నూగు కోదమ యంచ
నాచు కంఠాన నురివడ నవయు కరణి;
పూవులకు బోయి మము వీడి పోయినావె
పున్నెముల కల్పవల్లి! మా కన్న తల్లి!

నొసల గుంకుమ బెట్టి పసు పిచ్చి మాయింటి
పేరంటమున కని పిలిచినావా !
పచ్చని పసినిమ్మపండ్లు గంపలబోసి
'ఇస్తి వాయన' మని యిచ్చినావా !

తులసికి నిత్యపూజలు పూలతో జేసి
వలయు నుద్యాపనల్ సలిపినావా!
ఈడైన మగనితో గూడి మా నట్టింట
గుడిచి పండుగ ముద్దు నడిపినావా!

ప్రొద్దు ప్రొద్దున నుదయించి ముద్దుమొలక!
సంజకే వాడిపోతి వాశ్చర్యముగను!
ఎంత నిర్దయుడో భగవంతు డకట!
మోడులను వీడి మొక్కల జాడ వెదకు!

ఒకచనుబాలు ద్రావి, మఱియొక్క స్తనంబున కాసజేయు బాలిక నకటా! దయాలవము లేక యెటుల్ విడదీసినాడ? వేటికి మెఱపించినావో యపుడే మఱి యేటికి దాచినావో? యూరక ఘటియింతువే కడుపు ఱంపపుగోతలు కష్టదైవమా!

## శాంతి

చాలును జాలు నీ ప్రణయజాతవిషాదము జూప మూడుప
ద్యాలు సఖీమణీ! స్పృహణ కందని యా తడిగుడ్డ కోత లీ
లాలిత శోకపాతము లిలన్ రతమైన విషాద మొందు బో
జాలదు ప్రేమతర్పణలు సల్పెడుబాష్పపుటంబు లుండగన్.

ఇట్లు కుమారుడు.

అక్షరాక్షర స్ఫుటముగ నబల చదివె
మాట డగ్గుత్తిక బడ గుమారలేఖ;
శాంతి చెదర నేమియును దోచని విచేష్ట
పూర్ణ యుండగ నంతలో ప్రొద్దు గ్రుంకె.

అణచిన నణగక తాపో
ల్బణ మగు మదితోడ నపుడు బాలిక నాయం
గణమున విడియించి చనెన్
గుణవన్మణి పూర్ణ యెడద కొడుకు స్ఫురించన్.

ఆశ్వయుజ కృష్ణపుద్వితీయ యగుట నాడు,
స్నానమాడిన కన్యకాజాల మెల్ల
రాత్రి భోజనాల్ సలిపి గోరంటరసము
పాణితలముల గై సేసి పవ్వళించె.

గొడ్డురాలైన విధికయి కుతిలపడుచు
నొక కుమారు బ్రేమించిన యోగ్యచరిత
పూర్ణ యారేయి కన్నులు మూయలేక
కడపె వేగింపరాని వెక్కసపు వెతల.

అపుడు విన నయ్యె మేల్కని నట్టి యిరుగు
పొరుగు తద్దెపేరంటాండ్ర "ముదురు లేత"
లనెడు గోరంటముచ్చట్లె యన్ని యెడల;
లేవు లేవు బాల్యమునాటి లీల లెందు !

అఱుగ దంచిన సన్నబియ్యంబు వండి,
పొట్లకాయలు నేతిపోపుల నమర్చి
పేఱబెట్టిన మీగడ పెరుగుతోడ
నపుడు తినిపించి రెల్ల కన్యలను సతులు.

ఉదయ మయ్యెను కమల వియోగమునకు
సైప జాలని మిత్రుబాష్పములు గాగ
తరులు గురియంగ, శూన్యపథంబు బట్టె
నందు నందున శోక రాగాంకురములు.

# క ష్ట క మ ల

ఎత్తయిన కొమ్మచెట్ల కాయత్తపఱచి
రుయ్యేలలు కొన్ని; కాని శిష్యులును నాడు
గురుకుమారికినై యమర్చిరి యుయాల
నొక్కదాని వసంతుని యొక్కతోట.

నాటివేకువ కమల కన్నమ్ము బెట్టి
తెల్లవారిన తనచెయి తీఱదనుచు,
గురుసతీమణి పుత్రిక కురులు దువ్వి
వేణి నల్లె పైడి జడకుప్పెలు జతించి.

తనదు మెడ నున్న కాసులదండ దీసి
కన్నెకంఠాన బెట్టి, గ్రక్కదలకుండ
చెంపలను దువ్వి రెప్పలం జెరుగు కాటు
కను పయట దిద్ది, పోయి ర మ్మనుచు బంపె.

తోడికన్నెలతో దమతోటలోన
వేసిన యుయాల నూఁగ నుల్లాసపడుచు
బోయె కమలాంబ, పిఱుదులు రాయు వేణి
కన్నె సింగారమున కొకవన్నె నీయ.

ఆ యలివేణితో నటు లాయారపు కుల్కు నడ లెస్సలంగగా
బోయిన బాల లొక్కొక్కరు ముచ్చట దీఱగ నూగి రంత య
న్యాయితచిత్తయయ్యుకమలాంబ యుయ్యాలనునెక్కె మాధవుఁ
బాయక యోరకంటగని బాగుగ నూచు మటంచు బల్కుచుఁ.

మాధవుండును గురుసుకుమారి నూచె
నంత కంత కూపుల వేగ మతిశయింప,
చుక్కలను దన్ను కమ లంచు ప్రక్క నున్న
కన్నె లఱచిరి; యప్పు డాకస్మికముగ.

ఆ యుయ్యాలయు రివ్వురివ్వున నభం బంటంగ బై కేగు చే
మో యై గిఱ్ఱున క్రిందకు న్సడివడెఁ బూబోణి వేణీభరం
బాయూపు న్వడి గంఠ మప్పు డురివేయఁ మార్మైడఁ బెట్టి చే
దోయి న్లంకెలు వడ్డ త్రాళ్ల నడుమఁ దూగాడె నయ్యో విధీ!

వేణి కంఠాన బిగియ పై బెనచుకొనిన
త్రాళ్ల వ్రేలాడు చెలి జూచి గొల్లుమనిరి,
యేడుపుల యెల్గు విని యిది యే మటంచు
కమల జననియు వచ్చె నక్కడకు వేగ.

## క ష్ట క మ ల

తనకు శోభలు గూర్చవచ్చిన కుమారి
జూడగా జాలినట్టి యా పాడునుమెల,
నంతలో బట్టి యాపి రాక్రాంతశోక
దూష్యమానమానసు లైన శిష్యవరులు;

సకియ వేణిని కాలపాశంబు జేసి
శ్రుతులు దీసిన వీణియ గతి నొనర్చె,
నక్క టక్కట గొనిపోవు నంతకునకు
నేమినెపములు గనబడ వీ జగాన!

కడుపు ఛేదించు శోకంబు నుడుపలేక
యవయవములు నిశ్చేష్టము లయి పోకాల,
కన్నెపై బడె వచ్చిన కన్నతల్లి
మొదలు గొడ్డంట నఱికిన కదళిమాద్రి.

ఏమి చెప్పంగ గలమొ! కన్యామతల్లి
దాకొలుపుచు బోయిన విషాదంపు జిచ్చు
జనకుని వసంతుని, ననుంగు సఖు గుమారు,
నందఱకు బ్రాణ మగు పూర్ణ నాహరించె.

# క ష్ట క మ ల

కన్నె మొగమున శోభలు కందలేదు,
పెదవి తాంబూలరాగంబు వదలలేదు
కనుల గాటుకనిగ్గులు కమలలేదు,
పూర్ణ వచ్చెడు సరి కామె పుణ్య మేమొ!

లేదు లే దింక జెప్పజాలిన కథాంగ
మబల వ్రాసిన కృతి యసమాప్తముగనె
యుండె నని పెక్కునాళ్లు శిష్యుండు పనవి
కలవరించె నను పలు కొకండు దక్క!

